# అథ అష్టాదశో%ధ్యాయః

# కాముని విజృంభణము

బ్రహ్మోవాచ|

తత్ర గత్వా స్మరో గర్వీ శివమాయావిమోహితః | మోహకస్స మధోశ్చాదౌ ధర్మం విస్తారయన్ స్థితః || 1

వసంతస్య చ యో ధర్మః ప్రససార స సర్వతః | తపస్స్థానే మహేశస్యౌషధిప్రస్థే మునీశ్వర || 2

వనాని చ ప్రఫుల్లాని పాదపానాం మహామునే | ఆసన్విశేషతస్తత్ర తత్ప్రభావాన్మునీశ్వర ||3

పుష్పాణి సహకారాణా మశోక వనికాసు వై | విరేజుస్స్మరోద్దీపకరాణి సురభీణ్యపి || 4

బ్రహ్మ ఇట్లు పలికెను-

గర్వము గలవాడు, శివమాయచే వ్యామోహితుడు, మోహమును కలిగించువాడు నగు ఆ మన్మథుడచటికి వెళ్లి, మున్ముందుగా వసంతుని ప్రభావమును అచట విస్తరింప చేయ జొచ్చెను (1). ఓ మహర్షీ! ఓషధిప్రస్థమునందు మహేశ్వరుడు తపస్సు చేయు స్థలములో సర్వత్రా వసంతుని ప్రభావము విస్తరిల్లెను (2). ఓ మహర్షీ! అచట వసంతుని ప్రభావముచే వనములోని చెట్లు అన్నియు విశేషించి వికసించినవి (3). మామిడి చెట్ల పూతలు, అశోక వృక్షముల పుష్పములు సుగంధమును వెదజల్లి మన్మథ వికారములను వృద్ధి పొందించునవై ప్రకాశించినవి (4).

కైరవాణి చ పుష్పాణి భ్రమరాకలితాని చ | బభూవుర్మదనావేశకరాణి చ విశేషతః || 5

సుకామోద్దీపనకరం కోకిలాకల కూజితమ్ | ఆ సీదతి సురమ్యం హి మనో హరమతి ప్రియమ్ || 5

భ్రమరాణాం తథా శబ్దా వివిధా అభవన్మునే | మనోహరాశ్చ సర్వేషాం కామోద్దీపకరా ఆపి || 7

చంద్రస్య విశదా కాంతిర్వికీర్ణా హి సమంతతః | కామినాం కామినీనాం చ దూతికా ఇవ సాభవత్ || 8

తుమ్మెదలచే చుట్టు వారబడియున్న తెల్ల కలువలు విశేషించి మదనావేశమును కలిగింపజొచ్చెను (5). మిక్కలి రమ్యము, మనోహరము, అతి ప్రియమునగు కోకిలల మధుర కూజితములు కామావేశమును అధికము చేయజొచ్చెను (6). ఓ మహర్షీ! తుమ్మెదలు చేయు వివిధ ఝుం కారములు కూడ మనోహరముగ నుండి సర్వప్రాణుల మన్మథ వికారములను పెంపొందించెను (7). చంద్రుని తెల్లని వెన్నెల అంతటా వెదజల్లబడి యున్నది. ప్రియులకు, ప్రియురాండ్రకు మధ్య దూత కృత్యమును ఆ వెన్నెలయే నిర్వహించుచున్నదా యన్నట్లుండెను (8).

మానినాం ప్రేరణాయాసీత్తత్కాలే కాలదీపికా | మారుతశ్చ సుఖస్పార్శో వవౌ విరహిణో%ప్రియః || 9

ఏవం వసంత విస్తారో మదనావేశ కారకః | వనౌకసాం తదా తత్ర మునీనాం దుస్సహో%త్యభూత్ || 10

అచేతసామపి తదా కామాసక్తిరభూన్మునే | సుచేతసాం హి జీవానాం సేతి కిం వర్ణ్యతే కథా || 11

ఏవం చకార స మధుస్స్వప్రభావం సుదుస్సహమ్ | సర్వేషాం చైవ జీవానాం కామోద్దీపనకారకః || 12

ఆ సమయములో కాల పురుషుని దీపము వలె నున్న వెన్నెల వ్యక్తుల అభిమానమును పారద్రోలి ప్రేమకు దారి చూపెను. ఓ మహర్షీ! విరహ తప్తులకు దుఃఖకరమగు వాయువు సుఖకరముగా వీచెను (9). అపుడచట ఈ తీరున మన్మథావేశమును కలిగించే వసంతుని విస్తారము వనమునందు నివసించే మునులకు అత్యంతము సహింప శక్యము కానిది ఆయెను (10). ఓ మహర్షీ! అపుడు జడపదార్థములకు కూడా కామమునందు ఆసక్తి కలిగినట్లుండెను. అట్టిచో చేతనులగు జీవులకు అట్టి ఆసక్తి కలిగినదని వర్ణింపనేల? (11) ఈ విధముగా సర్వప్రాణులలో కామమును ఉద్దీపనము చేయు ఆ వసంతుడు మిక్కిలి దుస్సహమగు తన ప్రభావమును విస్తరింపజేసెను (12).

అకాల నిర్మితం తాత మధోర్వ్యక్ష్య హరస్తదా | ఆశ్చర్యం పరమం మేనే స్వలీలాత్తతనుః ప్రభుః || 13

అథ లీలాకరస్తత్ర తపః పరమదుష్కరమ్ | తతాప స వశీశో హి హరో దుఃఖహరః ప్రభుః || 14

వసంతే ప్రసృతే తత్ర కామో రతి సమన్వితః | చూతం బాణం సమాకృష్య స్థితస్తద్వామపార్శ్వతః || 15

స్వప్రభావం వితస్తార మోహయన్ సకలాన్ జనాన్ | రత్యా యుక్తం తదా కామం దృష్ట్వా కో వాన మోహితః || 16

వత్సా! తన లీలచే దేహమును స్వీకరించియున్న శివప్రభుడు అపుడు అకాలమునందు విజృంభించిన వసంతుని ప్రభావమును గని మిక్కలి ఆశ్చర్యమును పొందెను (13). లీలలను సృష్టించువాడు, జితేంద్రియుడు, సర్వ జగన్నియంత, దుఃఖములను బాపువాడు నగు శివ ప్రభుడు అచట మిక్కలి దుస్సాధ్యమైన తపస్సును చేసెను (14). అచట ఇట్లు వసంతుడు విజృంభించగా, రతీదేవితో కూడియున్న మన్మథుడు చూత బాణమును ధనస్సుపై సంధించి ఆమె ఎడమ ప్రక్క

నిలబడియుండెను (15). ఆతడు తన ప్రభావమును విస్తరింపజేసి, సర్వ మానవులను మోహింపజేసెను. అపుడు రతీ దేవితో ఆ విధముగా నున్న మన్మథుని చూచి మోహమును పొందని వారు ఎవ్వరు గలరు? (16)

ఏవం ప్రవృత్తే సురతౌ శృంగారో%పి గణైస్సహ | హావభావయుతస్తత్ర ప్రవివేశ హరాంతికమ్ || 17

మదనః ప్రకటస్తత్ర న్యవసచ్చిత్తగో బహిః | న దృష్ట వాంస్తదా శంభోశ్ఛిద్రం యేన ప్రవిశ్యతే || 18

యదా చాప్రాప్త వివర స్తస్మిన్ యోగివరే స్మరః | మహాదేవే తదా సో%భూన్మహాభయ విమోహితః || 19

జ్వలజ్జ్వాలాగ్ని సంకాశ భాలనేత్రసమన్వితమ్ | ధ్యానస్థం శంకరం కో వా సమాసాదయితుం క్షమః || 20

ఈ విధముగా మన్మథుడు విజృంభించగా, శృంగారరసము కూడా హావ భావములతో కూడివచ్చి అచట గణములతో గూడియున్న శివుని సమీపమును చేరుకొనెను (17). మనోభవుడగు మన్మథుడు అచట ప్రకటముగా బయటనే నివసించజొచ్చెను. కాని ఆతడు శంభుని ధైర్యమును చెదరగొట్టుటకు ఉపకరించు దుర్బలతను ఆయనలో కనుగొన లేకపోయెను (18). అపుడు యోగిశ్రేష్ఠుడగు ఆ మహాదేవుని యందు దౌర్బల్యమును గానరాక ఆ మన్మథుడు మహా భయమును పొంది మోహితుడాయెను (19). మండే జ్వాలలతో గూడిన అగ్నిని పోలియున్న మూడవ కంటితో గూడియున్న శంకరుడు ధ్యానము నందుండగా, ఆయనను సమీపంచి ఆయన ధ్యానమును చెదరగొట్టగలిగే సామర్థ్యము ఎవరికి గలదు ? (20)

ఏతస్మిన్నంతరే తత్ర సఖిభ్యాం సంయుతా శివా | జగామ శివపూజార్థం నీత్వా పుష్పాణ్యనేకశః || 21

పృథివ్యాం యాదృశం లోకై స్సౌందర్యం వర్ణ్యతే మహత్ |
తత్సర్వమధికం తస్యాం పార్వత్యామస్తి నిశ్చితమ్ || 22

ఆర్తవాణి సుపుష్పాణి ధృతాని చ తయా యదా | తత్సౌందర్యం కథం వర్ణ్యమపి వర్షశ##తైరపి || 23

యదా శివసమీపే తు గతా సా పర్వతాత్మజా | తదైవ శంకరో ధ్యానం త్యక్త్వా క్షణమవస్థితః || 24

ఇంతలో అచటకు సఖురాండ్రిద్దరితో గూడి పార్వతి అనేక పుష్పములను తీసుకొని శివపూజ కొరకు వెళ్లెను (21). భూమండలములో దేనిని మానవులు గొప్ప సౌందర్యమని వర్ణింతురో, ఆ సౌందర్యమంతయూ మాత్రమే గాక, అంతకంటె అధికమగు సౌందర్యము కూడ పార్వతియందు నిశ్చితముగా గలదు (22). ఆ యా ఋతువులలో పూసిన అందమగు పుష్పములను ధరించిన సమయములో ఆమె సౌందర్యమును వర్ణించుటకు వంద సంవత్సరముల కాలమైననూ చాలదు (23). ఏ క్షణములో ఆ పార్వతి శివుని సమీపమునకు వెళ్లినదో, అదే సమయములో శంకరుడు క్షణకాలము ధ్యానమును వీడి యుండెను (24).

తచ్ఛిద్రం ప్రాప్య మదనః ప్రథమం హర్షణ   న తు | బాణ   న హర్షయామాస పార్శ్వ స్థం

చంద్రశేఖరమ్ || 25

శృంగారైశ్చ తదా భావైస్సహితా పార్వతీ హరమ్ | జగామ కామసాహాయ్యే మునే సురభిణా సహ || 26

తదైవాకృష్య తచ్చాపం రుచ్యర్థం శూలధారిణః | ద్రుతం పుష్పశరం తస్మై#ి్మ స్మరో%ముంచత్సుసంయతః || 27

ఆ లోసుగును కనిపెట్టిన మన్మథుడు ముందుగా హర్షణము అనే బాణముతో పార్వతి ప్రక్కన ఉన్న చంద్రశేఖరుని హర్షింపజేసెను (25). ఓ మహర్షీ! అపుడు శృంగార భావములతో గూడిన పార్వతి వసంతునితో బాటు మన్మథునకు సహాయపడు విధముగా శివుని వద్దకు వెళ్లెను (26). అదే సమయములో మన్మథుడు జాగరూకతతో తన ధనస్సును ఎక్కుపెట్టి శూలధారియగు శివునియందు ప్రేమను ఉత్పన్నము చేయుట కొరకై వెనువెంటనే పుష్పబాణమును ప్రయోగించెను (27).

యథా నిరంతరం నిత్యమాగచ్ఛతి తథా శివమ్ | తన్నమస్కృత్య తత్పూజాం కృత్వా తత్పురతస్స్థితా || 28

సా దృష్ట్వా పార్వతీ తత్ర ప్రభుణా గిరిశేన హి | వివృణ్వతీ తదాంగాని స్త్రీ స్వభావాత్సలజ్జయా || 29

సుసంస్మృత్య వరం తస్యా విధిదత్తం పురా ప్రభుః | శివో%పి వర్ణయామాస తదంగాని ముదా మునే || 30

ప్రతి దినము విడువకుండగా ఆమె ఏ తీరున శివుని వద్దకు వచ్చెడిదో, సరిగా అదే విధముగా ఆమె వచ్చి, నమస్కరించి, పూజచేసి ఆయన యెదుట నిలబడెను (28). అచట స్త్రీ స్వభావము వలన మిక్కిలి లజ్జతో పార్వతి నిలబడి యుండగా ఆమె అవయవములలో ప్రకటమగు చున్న శోభను కైలాసపతి యగు శివప్రభుడు చూచెను (29). పూర్వము ఆమెకు బ్రహ్మ ఇచ్చిన వరమును శివుడు స్మరించుకొనెను. ఓ మహర్షీ! అపుడా ప్రభుడు ఆనందముతో ఆమె అంగములను వర్ణించెను (30).

శివ ఉవాచ|

కిం ముఖం కి శశాంకశ్చ కిం నేత్రే చోత్పలే చ కిమ్ | భ్రుకుట్యౌ ధనుషీ చైతే కందర్పస్య మహాత్మనః || 31

అధరః కిం చ బింబం కింకిం నాసా శుక చంచుకా | కిం స్వరః కోకిలాలాపః కిం మధ్యం చాథవేదికా || 32

కిం గతిర్వర్ణ్య తే హ్యస్యాః కిం రూపం వర్ణ్యతే ముహుః | పుష్పాణి కిం చ వర్ణ్యంతే వస్త్రాణి చ తథా పునః || 33

లాలిత్యం చారు యత్సృష్టౌ తదేకత్ర వినిర్మితమ్ | సర్వథా రమణీయాని సర్వాంగాని న సంశసయః || 34

శివుడిట్లు పలికెను-

ఇది ముఖమా? చంద్రుడా? ఇవి నేత్రములా? కలువలా? ఇవి కనుబొమలా? మహాత్ముడగు మన్మథుని ధనస్సులా? (31) ఇది అధరమా? దొండపండా? ఇది నాసికయా ? లేక చిలుక ముక్కు అగునా? ఆహా! ఏమి కంఠధ్వని? కోకిల గీతమును పోలియున్నది. ఈమె నడుము అగ్ని హెూత్రవేది వలె సన్నగా నున్నది (32). ఈమె నడకను ఏమని వర్ణించెదను? ఈమె రూపమును ఎన్నిసార్లు వర్ణించెదను? ఈమె ధరించిన పుష్పములను, వస్త్రములను ఏమని వర్ణించగలను? (33) సృష్టిలోని సౌందర్యము అంతయూ ఒక్కచోట ప్రోగు చేసినట్లున్నది. ఈమె అవయవములు పూర్ణ రమణీయములనుటలో సందియము లేదు (34).

అహెూ ధన్యతరా చేయం పార్వత్యద్భుత రూపిణీ | ఏతత్సమా న త్రైలోక్యే నారీ కాపి సురూపిణీ || 35

సులావణ్య నిధిశ్చేయమద్భుతాంగాని బిభ్రతీ | విమోహినీ మునీనాం చ మహా సుఖ వివర్ధినీ || 36

అహెూ! అద్భుతమగు రూపముగల ఈ పార్వతి ధన్యురాలు. ఇంతటి సుందరి ముల్లోకములలోనైననూ మరియొక స్త్రీ లేదు (35). అద్భుతమగు అవయవములను కలిగియున్న ఈమె మంచి లావణ్యమునకు నిధియై యున్నది. గొప్ప సుఖమును వర్ధిల్లజేయు ఈమె మునులనైననూ మోహపెట్టగలదు (36).

బ్రహ్మోవాచ|

ఇత్యేవం వర్ణయిత్వా తు తదంగాని ముహుర్ముహుః | విధి దత్త వరధ్యానాద్ధరస్తు విరరామ హ || 37

వివృణ్వతీ నిజముఖం పశ్యంతీ చ ముహుర్ముహుః | సువీక్షణైర్మహామోదాత్సుస్మితాభూచ్ఛివా మునే || 38

ఏవం చేష్టాం తదా దృష్ట్వా శంభుర్మోహముపాగతః | ఉవాచ వచనం చైవం మహాలీలో మహేశ్వరః || 39

అస్యా దర్శన మాత్రేణ మహానందో భవత్యలమ్ | యదాలింగనమేతస్యాః కుర్యాం కిం తు తతస్సుఖమ్ || 40

హరుడు ఈ విధముగా అనేక పర్యాయములు ఆమె అవయవములను వర్ణించి, బ్రహ్మ ఇచ్చిన వరమును గుర్తు చేసుకొని విరమించెను (37). ఓ మహర్షీ ! పార్వతి తన ముఖమును ప్రకటము చేసి, పదేపదే ప్రేమ వీక్షణములతో మహానందముతో చూచుచూ చక్కటి చిరునవ్వుతో కూడి యుండెను (38). ఆమె యొక్క ఆ చేష్టను చూచినవాడై, గొప్ప లీలలు గలవాడు, మహేశ్వరుడునగు శంభుడు మోహమును పొంది ఇట్లు పలికెను (39). ఈమెను చూచినంత మాత్రాన మహానందము కలుగుచున్నది. ఈమెను నేను కౌగిలించుకున్నప్పుడు ఎంతటి సుఖము కలుగునో గదా! (40)

క్షణమాత్రం విచార్యేత్థం సంపూజ్య గిరిజాం తతః | ప్రబుద్ధస్స మహాయోగీ సువిరక్తో జగావితి || 41

కిం జాతం చరితం చిత్రం కిమహం మోహమాగతః | కామేన వికృతశ్చాద్య భూత్వాపి ప్రభురీశ్వరః || 42

ఈశ్వరో%హం యదీచ్ఛేయం పరాంగ స్పర్శనం ఖలు | తర్హి కో%న్యో%క్షయః క్షుద్రః కిం కిం నైవ కరిష్యతి || 43

ఏవం వైరాగ్యమాసాద్య పర్యంకాసాదనం చ తత్ | వారయామాస సర్వాత్మా పరేశః కిం పతేదిహ || 44

ఇతి శ్రీ శివ మహాపురాణ రుద్ర సంహితాయాం పార్వతీ ఖండే కామకృత వికార వర్ణనం నామ అష్టాదశో%ధ్యాయః (18).

మహాయోగి యగు ఆ శివుడు క్షణకాలము ఇట్లు అలోచించి, తరువాత పార్వతిని ఆదరించెను. ఆయన తెలివిని పొంది (మోహమును వీడి) గొప్ప వైరాగ్యము గలవాడై ఇట్లు అనుకొనెను (41). ఏమైనది? చిత్రమగు ఘటన జరిగినది. నేను మోహితుడనైతిని యేమి? నేను సమర్థుడను, ప్రభుడను అయి ఉండియూ, ఈనాడు కామునిచే వికారమును పొందునట్లు చేయబడితిని (42). ఈశ్వరుడనగు నేనే పరస్త్రీని స్పృశించ గోరినచో, ఇతరులగు సామాన్య ప్రాణులు ఏ పనిని చేయుటకు తగరు? ఏయే పనులను చేయకుందురు? (43) సర్వప్రాణుల ఆత్మభూతుడగు ఆ పరమేశ్వరుడు 'దీనివలన ప్రయోజనమేమున్నది?' అని నిశ్చయించుకొని, వైరాగ్యము నాశ్రయించి, ఆమెను పొందవలెననే ఆకాంక్షను నివారించుకొనెను (44).

శ్రీ శివ మహాపురాణములో రుద్ర సంహితయందలి పార్వతీ ఖండములో కాముడు వికారములను కలిగించుట అనే పదునెమిదవ అధ్యాయము ముగిసినది (18).